P. Padma

# హంసలదీవి గోపాల శతకము

కాసుల పురుషోత్తమకవి

విరచితము.

వేమూరి చిరంజీవావధానులు చే

ప్రకటితము.

—o—

నేషనల్ ప్రెస్. బుట్టయ్యపేట.

మచిలీపట్టణము

1925

# హంసలదీవి గోపాల శతకము. 

సీ॥ శ్రీ రుక్మిణీ మనస్సార సేదిందిర
సత్యభామాముఖాబ్జాతమిత్ర
జాంబవతీ పటుస్తన శైలజీమూత
ఘనసుదంతాన యౌవనమదేభ
లక్ష్మణాపరి రంభలలిత పంజరకీర
భద్రావళీ తరంగ వన మరాళ
మిత్రవిందాధర మృదులపల్లవపిత
రవిజాదృగుత్పల రాజబింప

తే॥ గీ॥ షోడశసహస్రకామినీ స్తోమకామ
బానజవిలాస హంసలదీవివాస
లలితకష్ణాబిసంగమస్థల విహార
పరమకరుణాస్వబావ గోపాలదేవ 1

సీ॥ లీలా వినోదకాళియ ఫణాంకితపాద
కలుషవిచ్ఛేద భక్తప్రసాద
హితవేణునాథ సంతతనుతాఖిలషేద
బహుమోద గోపికాప్రణయవాద
హోషిత ప్రహ్లాద బుధమయూరాంబోధ
సవతహిహ్నఖాద దానవవిభేద
శ్రీత జనాశ్రిత శాశ్వితయశస్సంపాద
మునిజానా శిర్వాదము క్తిఖేద

తే॥గీ॥ కృపదవహింపుమునా మీదకీర్తికాద - భావజవిలాస॥ 2

సీ॥ అభినవ వస్ఫుట సితాబ్జాయత ప్రతాక్ష
యాదవ పాండవ భేదపక్ష
[illegible]భవనమాలికా విరాజితవక్ష
పరమద యార్ద్రిబాసురకటాక్ష
[illegible]ద్దశ జగత్పరి పాలనాద్య
శరణాగత త్రాణనిరతదీక్ష

దారుణమై తేయకారణహర్యక్ష
మౌని సంతాన సంతానవృక్ష
తే॥గీ॥ తలచెదన పేక్షనా యెడపలదు పేక్ష-బావజవిలాస॥ 3
సీ॥ నవనీత చోర వల్లవకామినీ జార
నందకుమార దానవవిదూర
ఘనమేచక శరీరకౌస్తుభమణిహార
మానితాచారసన్మంత్రసార
చంద్రోమయా కారబృందావన విహార
కనకాద్రి ధీరసాగర గభీర
దివిజోపకారస్వాత్తిక గుణాలంకార
త్రిజగ దాదారనిర్జత వికార
తే॥గీ॥ వినుతి చేకోర యాదవవీరరార-బావజవిలాస॥ 4
సీ॥ చరణ పద్మములు కాంచన నూపురంబులు
గమవ సంగతులు గల్ఘల్లురనగ
కటిసూత్రమణి మ యాఘంటికానాదంబు
కరమొప్పగా ఘణంఘణయనంగ
మేనిపైగప్పిన మించుమంచిన చాయ
నగు పిచ్చడము తళత్తళ యదంగ
నొనరు చూడా భాగము నరలంకారమౌ
నెమలిపింఛము నిగన్నిగ యనంగ
తే॥గీ॥ సుందరాకృతి రమ్ముగనొందు మిమ్ము-బావజ॥ 5
సీ॥ పుట్టినప్పుడె బట్టి కొట్టగాచిన మామ
గట్టి బాపినయట్టి దిట్టదొంగ
మెల్లమెల్లన గొల్లపల్లెలో పాల్వెన్న
కొల్లకొల్లగ గొన్నపిల్లదొంక
జలములాడగ జూచి చానలవల్వలు
చెలగుచు దెచ్చిన చిన్నదొంగ
వైతముచే పెంటనంటి బట్టగవచ్చు
యవను మాయించిన యట్టిదొంగ

తే॥గీ॥ దొరికితివి నాకు నిశ్శంక విడువనింక-బావజవిలాస॥ 6

సీ॥ కుబ్జగంధ మొసంగి కొమరు ప్రాయంబున
శాతకుంభ శలాకరీతినుండె
మాలికుండొక్కఁడు మాలికర్పన జేసి
మౌనులు గనగనిర్మలత గాంచె
రీజకుడు శుభ్ర వస్త్రములుగట్టగ నిచ్చు
యిహ పరసౌఖ్యంబులెనసి మించె
విదురు డిష్టాన్న పులిందులు గావించి
భాగవతో త్తమ ప్రతిభగాంచె
తే॥గీ॥ కులము కారణమౌన్నికు గుణమె కాని-బావజవిలాజ॥ 7

సీ॥ మృతగురువు తృని బ్రతికించుటె సాక్షి
ప్రాణార్థులై మిమ్ము బలుకవారి
అలకుచేలుని కెల్ల కలుములిచ్చుట సాక్షి
సౌఖ్యార్థియై బుమ్ము చదువువారి
అర్జున సారథ్యమమర జేయుట సాక్షి
విజయార్థులై మిమ్ము వేడువారి
బావినుత్తర గర్భరక్ష సేయుట సాక్షి
పుత్రార్థులై మిమ్ము బొగడువారి
తే॥గీ॥ కన్న కోర్కెలు గల్గునిన్ సన్నుతింప-బావజవిలాస॥ 8

సీ॥ నిన్ను యశోదాదేవి పెనురోట గట్టెనా
వనిత స్వాతంత్ర్య మొంతనిభజింతు
నిను నందుడాలకుర్రల గాయ నుంచెనా
ఘనుని సామర్థ్య మెంతనినుతింతు
వాభీర సుతులు నిన్నొత్త తచెనగిరా
తన యులభాగ్య మెంతని గనింతు
గోపకాంతలు నిన్ను కోపించి తిట్టిరా
నన బొంట్లరేఖ నెంతని వచింతు
తే॥గీ॥ వారి దాసానుదాసులే దీరులైను-బావజవిలాస॥ 9

సీ॥ కురువరాకర్షితాంబరయైన ద్రౌపదీ
కాంతాభిమాన మేగతినినిలిచె ?।
బలుసాతులు భుజించు పాండవు లడవిలో
నతిథుల కన్న మేగతి మెసంగి ?
రర్జునార్థము కర్ణుఁడమరఁదాచిన శకి
కదనరంగమున నేగతిని మఱచె ?।
ద్రౌణిబాణజ్వాలఁదాకిన నుత్తరా
గర్భస్థపిండ మేగతిని బ్రతికే ?।
తే॥గీ॥ నీగతినిగాదె పాండవుల్ నిలిచిమనుట - భావజవిలాస॥ 10

సీ॥ స్థనవిషదుగ్ధంబుఁద్రావించు పాతకి
పూతన కమృతత్వమును ఘటించి ।
హింసింప గంసుండు నిచ్చరప్పించిన
వారికి వయికుంఠ వాసమొసగి ।
దుర్భాషలాడిన దుష్టాత్మశిశుపాలు
నంశమీయందుయైక్యంబుజేసి ।
పేర్మిని మీకథల్ విననిఘంటాకర్ణు
నెలమికైవల్య నిశ్చలునిఁజేసి ।
తే॥ గీ॥ రిపులబ్రోచినదేవింత శ్రితుల కెంత-భావజవిలాస॥ 11

సీ॥ భువనత్రియైక సంపూర్ణుఁడవగు నీకు
నందకుటీరమా ? మందిరంబు ?।
పాలమున్నీటిలో నోలలాడెడి నీకు
మహియశోదాస్థన్యమా ? బలంబు ?।
పదపద్మమున గంగయుదయ మందిననీకు
సురసమా గోపికాకర జలంబు ।
అహిరాజ భోగపర్యంకంబు గలనీకు
తల్పమా రాధికా తరుణియంక ?

తే. గీ. మహహా! నారలభాగ్యమెంతనగవచ్చు - భావజవిలాస॥
సీ. బృందావనస్థలియందు గోబృందంబు 12
సందందగాయుచు డెందమందు !
సందళించిన మహానందంబుతో వేణు
వందిరాగామృత బిందుసమితిఁ ।
జిందగానముసేయఁబొందుగ వినిగోప
సుందరులందఱు మందగతిని !
బంధుగుల్, మగలు, మరందులు వలదనఁ
గందర్ప కేళి నీయందుఁ జెంది ।
తే. గీ. మందిరంబుల కేగి శానందమునను - భావజవిలాస॥
సీ॥ గతి నీవె సుమ్మా, నీ పతివేఁగరమ్మా నా 13
మతిఁ బాదుకొమ్మా, కామితము లిమ్మా !
కృపశాలి వెన్న, నే నపచారి నన్న, నిం
తపరాకు నీకున్న, నెపము రన్న ।
దీనులమాట యెందైన నీ చెవి నాటఁ
బూను మచ్చోట పెంపూనుటతే !
పరుల నే గోర సంసరణపారావార
తరణంబునేర దేవరదె భార ।
తే. గీ, మనుచునున్నాఁడరక్షించుమార్తిబోఁద్రిడ-బావజవిలాస॥ 14
సీ॥ గోపకన్యలు నిన్నుఁ గోరిపూజలొనర్పఁ
గోరి జేరినవారిఁగూడినావు ।
వీరప్రతిజ్ఞార్థ మారూఢిగాగెల్పుఁ
గొని యష్టభార్యల గూడినావు ।
నరకుని చెరవాప తరుణుల పదియారు
వేలు నిన్మోహింప నేలినావు ।
బహురాజ శుద్ధాంతబామినుల్ గోరిన
హృదయ సంగంబున నెవసినావు ।
తే. గీ. గాని నిష్కాముకుండ వీవుగా రమేశ - బావజవిలాస॥ 15

సీ॥ పొత్తుల బసిపిల్ల బోషించు తల్లిని
బోలి సేవకకోటిబ్రోతు వెలమి ।
పక్షి ముక్కున దెచ్చి ఫలము బిల్లలకిచ్చు
గతి నిచ్చెదవు భక్త కామితములు ।
వత్స వెన్వెంట బోవగ నేగు ధేనువు
గతి చరింతువు సదాశ్రితులవెంట ।
రాజకుమారాపరాధంబు కెవడి
భట్టులదోషముల్ బాపుచుందు ।
తే. గీ. రేరి నీవంటి పోషకు లెంచిచూడ - బావజవిలాస॥ 16

సీ॥ ఆననాబ్జమున బ్రహ్మాండంబు జూపిన
దెవంబవని తల్లి దలంచుకొనెనె ।
కొండట్లు కొన గోరంగొనుగుగా జట్టిన
నాభీరులెల్ల నిన్నాద్యుడనిరె ।
విశ్వరూపము జగద్విఖ్యాతిం జూపిన
కౌరవుల్ నిన్నీశులగా నెఱింగెరె ।
క్షీరత ధరణిపై వారించి ప్రోచిన
జనులు పరబ్రహ్మమనుచుననిరె ।
తే. గీ. తెలిసినట్లున్న నీమాయ తెలియదహహ - బావజవిలాస॥ 17

సీ. జారత్వమున జహాస్త్రీరతాసక్తి చే
మెలంగెడు నిన్ను నస్ఖలితుడండ్రు ।
చోరత్వమునంబ్రజాగారాశినవనీత
హరునినిన్ దానిర్వికారుండండ్రు ।
ప్రపత్వమున సంద్రపాలనముసేయు
మందునివిన్ను శ్రీమందుడండ్రు ।
నదుర్త్వమున భోజనాథానువర్తన
గలవిన్ను సర్వాధికారుండండ్రు ।
తే. గీ. స్వామివనినిన్ను నిందింపజాలరింక - బావజవిలాస॥ 18

సీ. అత్యంత సూక్ష్ముండవయ్యు నాదేవకి
గర్భాంకురంబవై గలిగితీవు ।
విశ్వరూపుండవయ్యు వివిధలీలామయ
బాలకృష్ణాకృతి బ్రవలితీవు ।
నిర్గుణాత్ముండవయ్యు నిఖిలచిత్తానంత
కళ్యాణగుణముల గాంచితీవు ।
సమదర్శమండవయ్యు శత్రువినాశంబు
శిష్ట పరికాశతం జేసితీవు ।
తే. గీ. నీకథల్ ముజ్జగంబుల నిల్పితీవు - బావజవిలాస॥ 19

సీ. కరిరాజు వక్రవక్రితచే మహార్తుండై
పిలిచినమాత్రనే పలుకలేదో ? ।
జనకాజ్ఞమీరి రాక్షసబాలుండంతటం
గలవన్నచోటనే కలుగలేదా ? ।
పినతల్లికోపింప వనితేగిధృవుండాత్మ
దలంచిన మ్రోంనే నిలువలేదా ? ।
మునికోప వహ్నిముట్టిన నంబరీషుండు
బ్రోవవేయన్నచో బ్రోవలేదా ?
తే. గీ. ఇంక కరుణాబ్ధివయ్యు మమ్మేలరాదా - బావజవిలాస॥ 20

సీ. నిర్మించితివనూన నిశ్చలభోగార్హ
భువనజాలముల నద్భుతముగాగ ।
నిలిపితివాత్మలో నిరాతాబ్జగర్భశం
కరముఖాధిపుల లోకంబులందు ।
కల్పించిత వనేక కలితనానావిధ
జీవులచితాప్ర చిత్రములుగ ।
పోషించితివనేక భూతకోటులనంత
రాత్మనై కరుణా కటాక్షములను ।
తే. గీ. నీవినోదాతిశయము వర్ణింపందరమె - భావజవిలాస॥ 21

సీ. గిరులచే సర్వ దిక్కరులచేఁగాకున్న
నీవు ధరించిన నిలిచెధాత్రి।
సురలచే యామినీ చరులచేఁగాకున్న
నీవుబూనిన సుధానిధిలభించె।
హరునిచే భారతీవరునిచేఁగాకున్న
నీవల్ల రాక్షసాభావమయ్యె।
నరునిచే నుర్వి నెవ్వరిచేతంగాకున్న
నీవల్లమనెధరాదేవసుతుఁడు।
తే. గీ. నీ కసాధ్యంబుగలదె వర్ణించిచూడ - భావజవిలాస॥ 22

సీ. పలికినప్పుడె సర్వ పాపముల్ బాయునీ
నామంబుబలుకని నాలుకేల।
వినియప్పుడె మనో విజయమౌ మీకథల్
విననేరకుండిన వీనులేల।
జూచినప్పుడె మహా శోభనంబగుమిమ్ము
జూడఁగోరని యట్టి చూపులేల।
సేయునప్పుడె కార్యసిద్ధియౌ మీ పదా
ర్చనసేయలేని హస్తంబు లేల।
తే. గీ. జ్ఞానవిషయంబు లీరీతి మానవగునె - భావజవిలాస॥ 23

సీ. క్రతుతపోదాన సువ్రత సమాచారులై
ప్రీతితత్ఫలము లర్పించువారి।
మృత్తికాదారు నిర్మిత రూపుగాంచి
స్థిరభక్తి మిమ్ము నర్చించువారి।
సుత, దాస, ధేను సంతతుల నీ నామాంకి
తుల జేసి పేరుగా బిలచువారి।
శుక శారికలకు సారెకు నుక్కరలబెట్టి
నీనామములబల్క నేర్పువారి।
తే. గీ. చేరి రక్షించుదువు వారివారి కొలదిఁ - భావజవిలాస॥ 24

సీ. ఏభువనంబునన్ దేభయాతురుండునీ
చింతసేయునో పరాకింతతగునె
ఏ దిక్కునందు నీవేదిక్కనుచు నెవ్వఁ
డాత్మనిల్పునో యలక్ష్యంబుదగునె
ఏదేశమందెవ్వఁడెట్టి కార్యాసక్తిఁ
జింతసేయునో పరాకింతతగునె
ఏ యూరనాబోటి హీనమనస్కుండు
శరణుజొచ్చునో యుపేక్షకునుదగునె
తే. గీ, దీన బాంధవుడంచునుఁ దెలుపవలదె - భావజవిలాస॥ 25

సీ. ఏ తండ్రినిర్మించె భూతకపంచకగుణో
పేతావయవ సర్వచేతనంబు
లేదాతరక్షించు నెలమిమాతృదరస్థ
కలితశాబకుల వత్సలతమెరయ
నేసద్గురుఁడు దెల్పె హితవుగా సుజ్ఞాన
మెలమి గర్భస్థజీవులకు నెల్ల
నేస్వామివెడలించె హేయదుర్భరగర్భ
నరకమగ్నుల బ్రాణవరదుడగుచు
తే. గీ. నట్టినిన్నాశ్రయించెద ననవరతము - భావజవిలాస॥ 26

సీ. శ్రీరమాసంభోగ శృంగారతల్పాహి
రాజనుష్ఠనకువాయు భోజనంబు
యుద్ధాదికార్య సన్నద్ధవాహనపక్షం
గాధీశునకు భుజంగాశనంబు
సంతతధ్యాన నిశ్చలయోగ యోగిరా
ట్పృతతికి ఫలపర్ణపారణంబు
జగదీశునకు సర్వసంపాదిత
రక్షితాద్యాది సర్వావనంబు
తే. గీ. లా॥ ఘనముస్వామి సిరిగల్గిలౌఁభ్యమేమి-భావిజవిలాస॥ 27

సీ. ఎన్నటికో నిశ్చలేంద్రియవ్యాపార
ధారణామతి నిన్ను దలఁచుభాగ్య
మెన్నటికో యవిచ్ఛిన్న దుస్తరఘోర
కర్మ సంసారగర వితీర్ణ
మెన్నటికో యుష్మదీయాది మధ్యాంత
నిర్విరోధజ్ఞాన నియతబుద్ధి
ఎన్నటికోయోగి హృన్నలినాట్యకృ
ర్భవదీయపాదాబ్జభక్తి శక్తి
తే. గీ. ఎన్నటికొమాకు నీ సుప్రసన్ననియతి - భావజవిలాస॥ 28

సీ. శయనించునో స్వప్నసంగతినైన మీ
శృంగారమూర్తి దర్శింపఁదలఁతు
దర్శించిసాష్టాంగ దండప్రణామముల్
బెట్టి పదాబ్జముల్ బట్టఁతలంతు
పట్టి వీడక భక్తి పారవశ్యంబున
నిశ్చలమతిని ధ్యానింపఁదలంతు
ధ్యానించిభవవార్ధి తరణంబుగావింపు
మనుచునిట్లు వరంబుగొనఁగఁదలఁతు
తే. గీ. నెంతదలఁచిన సాక్షాత్కరింపవేమి - భావజవిలాస॥ 29

సీ. పారుజాత మరందపానబంభరరాజ
మాకౌన్న వేమువ్వానంఁజనునె
కాంచనాబ్జమృణాలకముల మెక్కుమరాళ
మలసివ తుంటి తూడులకుఁజనునె
యమృతాన్నచంద్రిక లనుభవించుచకోర
మేమరియైన నుమ్మెత్తదినునె
సహకారకిలయస్వాదుగన్నపికంబు
కోరునే కలనైన కుటజములను
తే. గీ. నిన్నుఁ గొలచిననరుండేటి కెన్ను నొరుల - భావజవిలాస॥ 30

సీ. శ్రీహరి స్మరణోక్తి సింహనాదము విన్న
బాఁపవే యాపద్ద్విపంబులుర్వి
అచ్యుత పాద పద్మార్చి తాశనిధార
బడకుండునే వైరి పర్వతములు
నారాయణధ్యానమారుతాహతి జేసి
పాయవే పాపౌఘ తోయదములు
ఖగరాజగమన కైంకర్యాదిరుచులచే
సమయవే యజ్ఞాన తిమిరజాల
తే. గీ. మనుచు నీ భక్తి బాయక యనఘులందురు - భావజవిలాస॥ 31

సీ. వక్షస్థలముదివ్య వయిజయంతీకౌస్తు
భాంతఃశ్రీదేవి యందగింప
కరచతుష్టయము విస్ఫురిత శంఖదాంగ
ఖడ్గకార్ముకముల గారవింప
శ్రోణీతలము స్వర్ణసూత్రసమంచిత
హేమదుకూలంబు నామతింప
మూర్ధంబురత్న జాంబూనదద్యుతినిష్క
శంక కోటీర మలంకరింప
తే. గీ. దీపితంబగు నీమూర్తిఁ జూపుమయ్య - భావజవిలాస॥ 32

సీ. వరదివాకర నిశాకరులు నీనేత్రంబు
లాననకాంతి సమానమేది
పరమేష్టి నీనాభి బద్మనివాసుండు
జఠరసంపద కెన్న సామ్యమేది
కమలజాండములు నీ కరకందుకంబులు
దోర్బలంబున తులదూగ నేది
నిఖిల తరంగిణుల్ నీసపాదకములు
శ్రీపాదమహిమాను రూపమేది
తే. గీ. కవులు కవితల వర్ణింపఁగల రెనిన్ను - భావజవిలాస॥ 33

సీ॥ పాయసంబాజ్య ధారాయుతంబుగజేసి
యోడక జుర్రినట్లుండుమదికి
విడిపంచదార మీగడతోటిపదమంచి
యుడుగక మెసగినట్లుండు మదికి
అరటిపండులు తేనెలందు దోగఁగముంచి
యొనరభక్షించి నట్లుండు మదికి
పచ్చికొబ్బరిబెల్ల మెచ్చుగాదంచినో
రూరంగా మెక్కినట్లుండు మదికి
తే. గీ. నీకథావర్ణనము మాకు నిఖిల రుచులు - భావజవిలాస॥ 34

సీ॥ కఠినాత్ముబండి అక్కసు చకాచకలుగాఁ
బడదన్నుచో నొప్పిపట్టెనేమొ
తటభూజమెక్కి చిత్రముగఁ గాళిందిలో
నవలీల దుముకుచో నవసెనేమొ
కాళీయఫణిఫణాగ్రములపై నర్తించు
నత్తరిపడగ రాలొత్తెనేమొ
ఫల్గును నరదంబుపైనుండి భీష్మపై
నలుక లఘించిన నలిగెనేమొ
తే. గీ. చరణపద్మంబు లొత్తెద సామి రమ్మ - భావజవిలాస॥ 35

సీ. శయ్యాహిబహుముఖోచ్ఛ్వాసనిశ్వాససాం
ద్రనినాదములచేత వినగరాదా
క్షీరపారావార సారతరోర్మికా
ఘననినాదములచే వినగరాదా
సాదివ్యసాలోక్య సారూప్య సేవక
స్తుతిరవంబులఁ జెవి సోఁకలేదా
సకల బృందారక జయజయవాక్యగం
భీరనాదమున విన్పింప రాదా
తే॥ గీ॥ ఎంతమొరపెట్టినను బల్కవేమి తండ్రి - భావజవిలాస॥ 36

సీ॥ కన్నుల గాంతుగా కాంతుగా గోపాల
కాంతలుదలచు సాకారు నిన్ను
వీనులవిందుగా విందుగా మాధురీ
సుస్వర వేణుగీతస్వనంబు
కోరికఁ బారగా బారగాఁ గరములఁ
గొనియెత్తుకొందుగా కోర్కెలలర
మునుకొనియాడగాఁ గొనియాడుచుందుగా
దేవదేవుఁడవని తెలిసి మదిని
తే. గీ. నాఁడెవ్రేపల్లె జన్మింప కీడనుంటి॥ - భావజవిలాస॥ 37
సీ. ఈడుబాలుర గూడి పాడుచు చేసంత
లాడుచుండఁగ నిన్నుఁ జూడఁగల్గు
వాడచేడియలచేవాడికాడని తల్లి
తోడనాఁడగ నిన్ను జూడఁగల్గు
దూడలఁ గాయుచో నోడక రాకాసిఁ
గ్రీడలఁ బడఁగూల్పఁ జూడఁగలుగు
పోకల, కన్నెలు, పొడఁజూడ వ్రేడగా
జాడలం దిరుగఁగా జూడగలుగు
తే. గీ. తొల్లి జన్మింపనైతి వ్రేపల్లెలోన - ॥భావజవిలాస॥ 38
సీ॥ జలకమార్చుచు నదీ జనకపాదాంభోజ
రవికోటి తేజో విరాజ యనుచు
జోలపాడుదు నందబాల జగత్పాల
స్వర్ణచేల కృపాలవాల యనుచు
మేలుకొల్పుదు రమాలోల సద్గుణజాల
నీలకుంతల లసత్ఫాల యనుచు
ముచ్చటాడుదు సర్వమూలకంద ముకుందఁ
వినుత సనంద గోవిందయనుచు
తే. గీ. తొల్లి జన్మింపనైతి వ్రేపల్లెలోను - భావజవిలాస॥ 39

సీ॥ ఘనసమోహనుని కాముని గన్నతండ్రివి నీ
చెలువ మింతింతని చెప్పవశమె
పతితపావని గంగ సుతయై చెలంగునీ
పుణ్యమింతింతని పొగడవశమె
కలుములొసంగు శ్రీకలవాణి నీరాణి
భాగ్యమింతింతని పలుకవశమె
దివ్యతేజో బలాధికులు నీభృత్యులు
అదికారమింతింత యనఁగవశమె
తే. గీ. నీసమానుఁడవన్నింట నీవెకాని - భావిజవిలాస॥ 40

సీ. హరిహర బ్రహ్మాది పరదైవతాంతరా
నేకరూపంబుల నిన్నుదెలిపి
వస్తుభేదాభేద వాదిశబ్దార్థోక్తి
నిగమాగమంబుల నిన్ను దెలిపి
పుణ్యతీర్థక్షేత్రముల ధరాస్థలియందు
నిర్నిద్రమహిమల నిన్నుదెలిపి
దానదయానత్య మానవగోవిప్ర
నిజవర్తనంబుల నిన్ను దెలిపి
తే. గీ. చేతనులనిట్లు తరియింపఁ జేసితీవు - భావజవిలాస॥ 41

సీ. నిరపరాధులకు నీశరణత్వ మెందుకు
నిష్టాత్ములకు నీదునియతియేమి
భాగ్యవంతులకు నీపరిపాలనంబేల
ధర్మజ్ఞులకు నీదుతత్వమరుదె
ఘనబుద్ధులకు నీదుకార్యమేమున్నది
సత్యవాధులకు నీసాక్షిఘనమె
తత్వవేత్తలకు నీదాక్షిణ్యమున నేమి
నిస్సంగులకు నీ మనిషయేల
తే. గీ. కల్బిషాత్ముని నను బ్రోవకీర్తినీకు - భావజవిలాస॥ 42

సీ. తనకు కళేబరంబునకు భేదజ్ఞాన
మతిలేనివాని నిర్మలతయెంత?
తనువువర్జించినంతట జీవుఁడేమౌనొ
తెలియనివాని తాత్వికమదెంత ?
కన్నతండ్రిని జగత్కర్త్తను నిన్నాత్మ
బోధఁజేయనివానిబుద్ధియెంత ?
భవజరామరణాదిభయనివారణమైన
పదముఁజేరనివాని భాగ్యమెంత ?
తే. గీ. యేమినేరనినన్నుఁబ్రోచుటిదియెవింత - భావజవిలాస॥ 43

సీ. రాసవిలాసగోపీసహస్రదృఢోప
గూహనంబులుగావుకూడివీడ
జననీనిబద్ధనిస్సరిశితోలూఖల
రజ్జువుల్ గావు శీఘ్రతసడల్ప
బృందావనస్థలపృథులగుల్మలతాంత
షండముల్ గావు నిశ్శంకవిడువ
గర్వితరాక్షసోత్కరకల్పితానేక
మాయలుగావు మర్మమునబాయ
తే. గీ. మాటతోఁగట్టినిల్పుదు మానసమున - భావజవిలాస॥ 44

సీ. తల్లిదండ్రుల చెర దప్పింప గంసుని
హతునిగావించు టార్త్తావనంబొ?
బాణుబాహాగర్వభంగంబొనర్చి నీ
పౌత్రు దెచ్చుట జగద్భద్రకరమొ?
ధార్త్తరాష్ట్రులఁజంపి ధాత్రీతలము మేన
బావకిచ్చుట దీనబాంధవంబొ?
అన్నగారివిరోధులగు దానవులనాజి
బొరియించుటది సర్వపోషణంబొ?
తే. గీ. రుకణ నీవారిఁబ్రోచుటే బిరుదు నీకు - భావజవిలాస॥ 45

సీ. పరకాంతలనక గోపస్త్రీలనందఱిఁ
జేరి క్రీడించిన చిన్నతనము
వావిగాదనక రాధావధూటీమణిఁ
బాయకకూడిన పడుచుఁదనము
సగుబాములనక నింపగురాణి యలిగినఁ
ద్రోయక మ్రొక్కిన దుడుకుఁదనము
లాఘవంబనక మెల్లఁగ జరాసంధుని
భీతిచేఁబారిన పిరికితనము
తే. గీ, గుట్టు విడరట్టొనర్తు చేవట్టనేని - భావిజవిలాస॥ 46

సీ॥ విరథుఁడైయున్న భాస్కర పుత్రినాజిలో
నరునిచేఁజంపింప న్యాయమగునె ?
ధర్మజుచే నసత్యఁపుఁబల్కుఁబల్కించి
గురునిమ్రింపించుట గొప్పదనమె?
గంగాకుమారుశిఖండి యుద్ధంబునఁ
బడఁగూల్పఁజూచుట పౌరుషంబె ?
మారుతిచే యధర్మముగా సుయోధను
తొడలుదున్మించుట దొడ్డతనమె ?
తే. గీ. ఇట్టి పుణ్యుండవన్ననీ గుట్టుగన్న - భావజవిలాప॥ 47

సీ. అత్యున్నతాకారివయ్యు బలీంద్రుని
యాచించు చోగుజ్జ వైతివీవు
అనఘ సద్గుణశాలివయ్యు సత్రాజిత్తు
వజ్రిమిమ్మని నిందఁబడితివీవు
అఖిల పూజార్హుఁడవయ్యు విప్రులనన్న
మడిగి యగౌరవంబందితీవు
అసహాయ శూరుఁడవయ్యు దైవతవీటి
పారుజాతముగొంచు పౌఱితీవు
తే. గీ. ఘనుల కైననుయాచ్న లాఘవమె సుమ్ము - భావజవిలాస॥ 48

సీ. ప్రాగ్భ హిఘంబులు బరిహరింపఁగజాల
విహదోషములు హరియింపఁగలవె
భ్రమణమనోజకాలములు మాన్పఁగఁజాల
వాపదలింకీవు బాపఁగలవె
అన్నవస్త్రముల సంపన్ను జేయగ లేవు
ఇష్టవదార్థంబు లీఁయగ పెల
కలనైననిపుడె సాక్షాత్కరింపఁగ జాల
వెంచ సన్నిధికి రావింపగలవె
తే. గీ. ఇపుడునమ్మికదోప నన్నేలుకొనడె - భావజవిలాస॥ 49

సీ॥ కామధేనువు, మహాగౌరవంబెంతురు
లేమిజెందిన వారికేమిబిదికె ?
కల్పజవితరణఖ్యాతిఁగీర్తింతురు
దారిద్ర్యునకు నేమీ తాను బితికె?
చింతామణివితీర్ణపంతంబుఁదలఁతురు
పేదలయిండ్ల నింపెనెధనంబు ?
నవనిధానముల వర్ణనఁజేతురుర్విలో
రికుతులకేమి కోరికలొసంగె
తే. గీ. దాతలెవ్వరు త్రిభువనతాత్రితవీవె - భావజవిలాస॥ 50

సీ. వహ్నిచేరథ రథాశ్వముల నిప్పింపవే
హితునిచేఖాండవం బేర్పజేసి
ధ్వజముపై హనుమంతు వసియింపఁజేయవే
బాణసేతువు కూర్మిసైభరించి
బలదేవుఁడీకున్నఁజెలియలిగూర్పవే
కపటయ తీంద్రునిగానొనర్చి
యనికిఁదోడౌచు నీవరుదేరవేమున్నఁ
బలువయౌరారాజు చెలిమిరోసి
తే. గీ. నదునిభక్తి భవన్మైత్రిదరమె పొగడ - భావజవిలాస॥ 51

సీ. దితిపుత్రకరగతామృతపాత్రి హరియించి
గయివతకోటికిఁ ద్రాపనీవె
ధృతరాష్ట్రసుతవ శీకృతరాష్ట్రదశబాపి
యవనిరాజ్యంబు పాండవులకీవె
బలివిక్రమించి స్వస్థలియాక్రమించిన
వానిద్రొక్కి-దివంబు వజ్రికీవె
శృతిచోరుఁడై పాఱివితాబ్ధిఁజొరఁజీరి
పావనామ్నాయంబు బ్రహ్మకీ వె

తే. గీ. క్షితిని నీవారినొరులు వంచింపగలఁరె - భావజవిలాస॥ 52

సీ. శ్రీరంగమున విప్రనారాయణునకేల
నాతికై కుంటెననడపినావు
పతితురాలొకతె నీపావనత్వమెఱుంగ
నీలాద్రిరాఁ గరుణించినావు
కాకుళనగరివైఖానసోక్తి నిజంబు
జూపశిరోజముల్ జూపినావు
గూనిగోవిందు సాక్షులఁబెట్టుటకుఁగాశి
వెడలినపొన్నూర వెలసినావు

తే. గీ. పామరుని నన్ను నిచటఁ జేపట్టినావు-భావజవిలాస॥ 53

సీ. శబ్దలక్షణ విచక్షణతజాలకు నీకు
కృతిఁగూర్చుటపరాధకృతముగాదె
కరణత్రియము నన్యగతులవర్తిలఁజేసి
వినుతులొనర్ప తప్పిదముగాదె
ఏనొనర్పెడు పాపమేభరింపఁగఁజాల
కెపుడు నిన్దూరుట యెగ్గుగాదె
అస్థిర దేహసుఖార్థసంపన్మనో
రథతబేర్కొందు నేరమియగాదె

తే. గీ. తప్పులొప్పులుగాగనుఁ దలఁపవలయు - భావజవిలాస॥ 54

సీ. ఆశాపిశాచంబు నదలింపనేరువే
తగినమీరక్షకత్వంబులేక
కామాదివైరుల గదుపంగనేరునే
నిలనీయ నుగ్రహబలిమిలేక
సంసారదుఃఖంబు నదలింపనేరునే
తథ్యంబు నీప్రసాదంబులేక
యజ్ఞానపంకంబు నడగింపనేర్తునే
పొసగిన మీదయారసములేక

తే. గీ. యన్నిటికిమీరె ప్రాపకులయ్యమాకు - భావజవిలాస॥ 55

సీ. ఒకమారుమీనామ ముచ్చరించిన(జాలు
ఖలుడజామీళు సంగతినివిన్న
శరణాగతుండైన(జాలుహంతవ్యుని
కాకాసురుని గాచు గాథ విన్న
విశ్వసించిన(జాలు వెలయవిభీషణు
రాజ్యాభిషేకధర్మంబువిన్న
నిముషమాత్రమెజాలు నినుబ్రసన్నుని(జేయ
ఖట్వాంగు మోక్షణజథనువిన్న

తే. గీ. మనసుదృఢమైన నీకృప(గనుటయెంత - భావజవిలాస॥ 56

సీ. భర్మగోపురమంట పాస్థానములుగలుగు
వేంకటేశ్వరు(డిలవేల్పుమాకు
నిజనాభియందు మాణిక్యంబు గల్గిన
వరదరాజిష్ట దేవతయెమాకు
సప్తసాలావృత సద్విమానారూఢ
రంగేశు డఖిలభారకు(డుమాకు
శ్రీకరభద్రాద్రి శిఖరనిత్యావాస
రామచంద్రుండేలురాజుమాకు

తే. గీ. కలవుమహదాశ్రియము లట్లతలతునిన్ను - భావజవిలాస॥ 57

సీ. ఆర్తరక్షాపరాయణ పౌరుషము నీకు
యాఢిగాదిక మమ్ము బ్రోవవేని
శరణాగతత్రాణ సద్బిరుదాంకమిం
కెల్లు బూదెడివు మమ్మేలవేని
పతితపావన మహాభద్రాభిధానంబు
గర్హితంబగు తిమ్మ గావవేని
శ్రితపరిపాలనాధృతనిరంతరదీక్ష
మానంగదగు మమ్ము మనుపవేని
తే. గీ. చిరయశంబెంచుకొమ్ము రక్షించుమమ్ము - భావజవిలాస॥ 58

సీ॥ సనకాదిమౌని హృత్సరసి జేందిందిర
ఇందిరానయనోత్పలేందుబింబ
బింబఫలద్యుతి విమలరదాంశుక
శుకయోగిపఠిత మంజుప్రబంధ
బంధకిల్బిషమేఘ పటలప్రభంజన
జనలోక సేవిత సదవతార
తారకాచంద్రికాధవళయశస్సార
సారసపత్రవిశాలనయన
తే. గీ. నయనరాధిపకులపోషభప్రభావ - భావజవిలాస॥ 59

సీ॥ చందనంబాశ్రిత బృందార కానంద
కారికి నాపదోద్ధారి కెపుడు
పాష్టాంగమథిక నిష్టాష్టాంగయోగాను
సారికిభువనాను సారి కెపుడు
దండ ఘద్ధంబారి మండలఖండన
క్రోధికినిత్య ప్రబోధి కెపుడు
జోహారుతారకా నీహారకరసార
కీర్తిశాలికి విష్ణుమూర్తి కెపుడు
తే. గీ. నను ను నీక క్తిదాయక యనఘులంద్రు - భావజవిలాస॥ 60

సీ॥ మునియైన సుందరీముఖ పద్మమీక్షించు
వేళ నీనాభిభావింపఁగలఁడె
తత్వజ్ఞుఁడైన కాంతాకచాభ్రము జూసు
తఱినీవపుష్కాంతి దలఁపఁ గలఁడె
యార్యుండైనఁ బరాంగనాధరమ్మును గాంచు
నెడనీదు కౌస్తుభంబెంచగలఁడె
మతిమంతుఁడైన స్త్రీచతురవాక్యప్రౌఢి
వినుచో భవత్కథల్ వినగండె
తే. గీ. మారు యుష్మత్కుమారునే ధీరుఁడోర్పు - భావజవిలాస। 61

సీ॥ పరభీషణాయుధ పంక్తిలోఁ జొచ్చిన
నీ యనుగ్రహమున్న నిర్భయంబు
దావపావకశిఖారితరముల దూరిన
నీ యనుగ్రహమున్న నిర్భయంబు
మత్తేభశార్దూల మధ్యమందుండిన
నీ యనుగ్రహమున్న నిర్భయంబు
ఘోరనక్రాభీల నీరధిఁ జేరిన
నీ యనుగ్రహమున్న నిర్భయంబు.
తే. గీ. భయనివారణమయ్య నీ ప్రాపకంబు - భావజవిలాస॥ 62

సీ॥ చిత్రగుప్తులు లిఖించినయట్టి కలుషంబుఁ
దునుపఁ బెట్టుట కీవె దొరపటంచు
ధర్మరాజు విదించు కర్మానుభవములఁ
బరిహరింపఁగ నీవె ప్రభుఁడవనుచు
యమభటుల్ కినుకన హంకరించినవారి
గదిమివేయఁగ నీవె కర్తవనుతు
ప్రకృతి వికారముల్ బాపి చిత్తము భవ
త్పరము జేయఁగ నీ వెగురుఁడ వనుచు
తే. గీ. నాశ్రయించితి కన్నిష్ప డాదు కొనవె - భావజవిలాస॥ 63

సీ॥ తనువునమ్మెద బుద్బుదప్రాయముగఁబుట్టి
లొల్లి గిట్టినవారితోవఁ దెలిసి
కలిమినమ్మెద చలచ్ఛల సంపదల నిక్కి
పేదవఁ జిక్కినవారి బేడఁదమెఱిఁగి
ప్రాయమెన్నెద మదాక్రాంత వై తిరిఁగి
ముదిసియీల్గెడివారి విధమెఱింగి
పరుల నమ్మెద దేహబంధుత్వములనంటి
తుదిపృథజనువారి దూరెఱింగి
తే. గీ. తెలివి లేదాయెఁగప్పెనీ దివ్యమాయ - భావజవిలాస॥ 64

సీ॥ వసుదేవదేవకీ పరగర్భరత్నాక
రామృతమూర్తి భక్తానువర్తి
నారదవ్యాసశౌనకపరాశరదివ్య
తాపసధ్యేయ పద్మాసహాయ
జగదేకనిర్మాణ సంత్రాణసంహార
త్రిగుణ ప్రధాన పన్నగశయన
ఘనవర రత్నకాంచన దివ్యభూషణ
శృంగారదేహ విహంగవాహ
తే. గీ. భువనమోహన వేష, సంపూర్ణతోష భావజవిలాస॥ 65

సీ॥ సర్వలక్షణములఁ జక్కని నిరుమేను
హృద్పుటంబున లిఖియింపుమయ్య
బుధజనానుగ్రహ పాత్రుని గావించి
యెంచిలోకముల మెప్పించుమయ్య
తాపత్రయంబుపఁ దపియింపకుండ నీ
వేనను నరసి రక్షింపుమయ్య
నేర్చినేర్వవిపను లేర్చినేరముగూర్చ
కోర్చిసద్గతినన్నుఁ జేర్పుమయ్య
తే. గీ. ఏమిసేయుదువో మీదఁదెలుఁగనయ్య - భావజవిలాస॥ 66

సీ॥ శ్రీకరంబులు భద్రసింహాంకితంబులు
పావనంబులు జగత్పావనములు
దేవతార్చితములు దృక్శోభనంబులు
బలిశిరోమణు లార్త బాంధములు
పద్మానుసరములు పద్మసన్నిభములు
శ్రుతిసిద్ధములు నితిసుందరములు
మునినిధానంబులు మూలమంత్రంబులు
తారకంబులు ముక్తిదాయకములు
తే. గీ. మీసదాంబుజములె మాకు ప్రాపకములు॥-భావజవిలాస॥

సీ॥ సూక్ష్మంబుకన్నను సూక్ష్మమై చెల్వొంది
యధికంబుకంటె నత్యధికుఁడనఁగ
గుణలోకమునను నిర్గుణుఁడనఁ బెంపొంది
సగుణంబుల మహాశరధియనఁగ
సద్బ్రహ్మచర్యన స్ఖలితమూర్తియనంగ
గార్హస్థ్యమున మహాఘనుఁడనంగ
అజ్ఞానహృత్పంక జాంధకారంబవై
ప్రాజ్ఞసద్హృదయ దీపంబవవఁగఁ
తే. గీ. దేజరిల్లెదు నిన్ను నుతింపఁదరమె - భావజవిలాస॥

సీ॥ పతివయోరూప సంపత్కళాన్వితుఁడైన
సతిమనంబునకు వాంఛితమికెద్ది?
జనకుండు శాశ్వత సామ్రాజ్యుఁడై యున్న
సుతుఁడు బెందఁగరాని సుఖమికెద్ది?
గురుఁడు బ్రహ్మానందపరుఁడు బోధకుఁడైనఁ
దగశిష్యుఁ డెఱుఁగని తత్వమెద్ది?
ప్రభుఁడు దయామయ విభవోన్నతుఁడైన
భటుఁడు గోరిక సేయు ఫలమికెద్ది?
తే. గీ. ప్రాపకుఁడవీవు మాకిఁకలోపమెది - భావజవిలాస॥

సీ॥ అఖిలధర్మస్థాపనా చార్యుడౌ యుధి
ష్ఠిరుడు వైవస్వతపుత్రముగాంచె
గోకోటిదానముల్ ప్రాకటంబుగఁజేసి
యూసరవెల్లియై పుట్టెనృగుఁడు
క్రతుశతావ బృథంబుగన్న యానహుషుండు
పెనుచిల్వయై బిలంబున జనించె
ఘనప పోనియతిచే ననఘుఁడైన యయాతి
సద్గతిఁబాసి భూసలికిమెరిగె
తే. గీ. వేషమున దాసుఁడను మహాదోషినయ్య-భావజవిలాస॥ 70

సీ॥ తిమి తిమింగలము లాదిగ చెంతలకు జేర
నంతయు గొందులయందు దూర
పాతాళఫణులు నప్పల నివ్వలను బార
జలరాసులన్నియు గలక బార
సోమకాసుర మహాచోరునిగ పోర
ప్రాణముల్ బాప కోపంబు దీర
బ్రహ్మతారకమంత్ర పఠనసన్నిధిజేర
శ్రుతులొసంగితి మహోన్నతులుమీర
తే. గీ. నౌరః వీరాదివీర! మత్స్యావతార - భావజవిలాస॥ 71

సీ॥ పాలసంద్రముపెద్ద పాలగూననున్న
తరి, భంగమయ్యె గోత్రములమిన్న
దానికి ఫణిరాజు త్రాడుగావలనగొన్న
సొరిది ద్రచ్చిరి విరాసురులు మున్న
జిగి దప్పి నీటిలో నగము గ్రుంగుచు నున్న
వేడ్క నె త్తితివినినేల్పులెన్న
పొలుపొంద నంతట బుట్టె మేలగు వెన్న
వేల్పుల కిచ్చితివెన్న వెన్న
తే. గీ. సిరిని జేకొన్న ధామేటి దొరవున్న - భావజవిలాస। 72

సీ॥ వివిధలోకావృతోర్వీచక్రమొకనావ
కణి వారదిముంచి గర్వభావ
మడర హిరణ్యాక్షుఁడుడుగక మీఱ్రోవ
కడ్డగించిన దైతుల్యలదరిపోవ
ధగధగ మనుచక్ర ధారచేతద్గ్రీవ
మెడయక ఖండించిదుప్రభావ
మున రసాతలగతావని కన్య నాకతేవ
కొమ్మునఁదగిలించు కొనుచునీస
తే. గీ. రమణఁ దోతేవ యజ్ఞవరాహదేవ - భావజవిలాస॥ 73

సీ॥ హరినిందు జూపరాయని పుత్రునడుగంగ
కలఁడన్న మాటనుకలడనంగ
పటుసభాస్తంభంబు పెటపెట చిటలంద
కువలయమెల్లనుఘూర్ణిలంగ
దృఢనఖదంష్ట్రాగ్ని దీప్తిభగ్గురనంగ
నుదయించి వసుకశిపూత్తమాంగ
మటికిపట్టియురంబు పఱియలువారంగ
బగిలించిదైత్యులు భళియనంగ
తే, గీ. నరహరీ దైత్యబాలు మన్నవె సొసంగ - భావిజవిలాస॥ 74

సీ॥ అదితికశ్యపుల భాగ్యాయత్తమున బుట్టి
సిరిగిల్లియాచింప మురువుదొట్టి
బలిచేఁ బదత్రయసలము దానముఁ బటి
పిన్నవంతులలోన మిన్నుముటి
పదయుగంబుర్వినభంబులంటఁబట్టి
దనుజేశుఁబాతాళమునకు నెటి
బలువేల్పుమూకలు వడుచెరల్ విడఁగొటి
ఘనత వజ్రికి సిరి గటిపెటి
తే. గీ. గుట్టుతో నుంటి పీపెకా పొటీదిట్ట - భావజవిలాప॥ 75

సీ॥ ధాత్రికిఁ క్షత్రియుల్ దలఁపఁగ నన్యాయ
గతులవర్తింపంగఁ గను నసూయ
ద్విజుఁడవై వేదశదిక్కులనసహాయ
శూరుఁడవనుచు సంస్తుతులు మ్రోయ
గండ్రగొడ్డలియనుకైదువ కేలసేయ
నిరువదియొకమారు నరులమాయ
చెండాడి సర్వభూమండల మామ్నాయ
విదులకిచ్చిదయటి వేల్పురాయ
తే. గీ. రాజరాజ నిధన్యేయ, రైణికేయ- భావజవిలాస॥ 76

సీ॥ హరి! నీవు మనుజుఁడ వౌటెంతయాశ్చర్య
మెదిరితాటక నేయుటెంతధైర్య
మవనిజాపరిణయోత్సవ మెంతయాశ్చర్య
మెచ్చిభార్గవుగెల్చు టెవతశౌర్య
మటవీగుహలు జేరుటదియెంతయాశ్చర్య
మెలమివారదిగట్టు టెంతవీక్య
మఖిలాసురధ్వంస నుదియెంతహత్సర్య
మిలనిజశ్రీగాంచు టెంతశౌర్య
తే. గీ. మౌరః! శ్రీరామచంద్రాఖ్యవీరవర- భావజవిలాస॥ 77

సీ॥ యాదవవంశ నిధూగయేందుఁడవౌచు
వెన్నెలకన్నమై వన్నదేల
కప్పుపచ్చడముమై గట్టుకయిరుగేల
ముసలహలంబులు బూనిలీల
ముష్టికాదినిశాటముఖ్యులనిలగూర్చి
పకలించి కరిపురస్థలి సమూల
మెత్తిన నీబలంబింతింతయనజాల
తెలిసినకొలఁది గీర్తింతుఁజాల
తే. గీ. కరముకన్పట్ట బ్రేమోలఁగాలపాల - భావజలాస॥ 78

సీ॥ త్రిభువన కంటక త్రిపురధానవయోష
కులపతివ్రతల కక్కులటదోష
మత్తించి తత్పురి యందుగల్గు నశేష
కుటిలాసురులనుగ్రగచటులరోష
దహనుచేత హరించి దైవతాసవఘోష
లాకసంబున మ్రోయనధికరోష
గరిమనందితి వీవె కౌస్తుభమణిభూష
యజ్ఞభుక్సంరక్షణాభిలాష
తే. గీ. బుధమనః ప్రియసంభాష బుద్ధవేష - భావజవిలాస॥ 79

సీ॥ వర్ణాశ్రమాచార నిర్ణయంబులు దక్కి
కామరోహాది దుర్గతులఁద్రొక్కి
సత్యధర్మ జ్ఞానశమదమాదులఁ దక్కి
కలినరుల్ విషయభోగముల సొక్కి
నిన్నెఱుంగకయున్న వెఱ తేజిపై నెక్కి
కరఖడ్గధార నాఖలులఁ జెక్కి
సాధుసజ్జనముల సద్భావములఁ జొక్కి
యిచ్చట వెలయుని నేను మ్రొక్కి
తే. గీ. ధన్యమతికైతి మీ ప్రసాదంబు మెక్కి - భావజవిలాస॥ 80

సీ॥ సప్తసముద్రముల్ సరవినీదుటగాదు
డిటముగాగట్టు మ్రోయుటయుగాదు
నిఖిలభూచక్రంబు నిర్వహించుటగాదు
బలుగంబమున నుద్భవిలుటగాదు
పదయుగంబున భూనభంబు లంటుటగాదు
ద్విజుఁడవై నృపతవర్తిలుటగాదు
శైలముల్ నీటిలో దేలగట్టుటగాదు
భుజమాని యెరుని నిల్పుటయుగాదు
తే॥గీ. సులభమున నేచనన్ బుద్ధ కలికిరూప - భావజవిలాస॥ 81

సీ॥ తిరుమలగురువరచరణాంబురుహతీర్థ
సేవనంబే తీర్థసేవనముగ
సతతోర్ధ్వపుండ్రలాంఛిత వైష్ణవానన
దర్శనంబే భవద్దర్శనముగ
రామగోవింద నారాయణాచ్యుతనామ
పఠనమే వేదాంతపఠనములుగ
అర్చావతార త్వదర్పితదివ్య ప్ర
సాదసిద్ధి భవత్ప్రసాదసిద్ధి
తే. గీ. గాఁదలఁతునింక మాకేలగల్గు శంక - భావజవిలాస॥ 82

సీ॥ ఎప్పుడు విషయభోగేచ్ఛ బాయకయుండు
నెప్పుడ సద్గోష్ఠి నెనసియుండు
ఎప్పుడంతశ్శత్రుహిత కార్యియైయుఁడు
నెప్పుడీషణ వాంఛదప్పకుండు
నెప్డుతపస్సున నెనసివర్తిలకుండు
నెప్పుడు నీసేవ నెనయకుండు
నెప్పుడీహార్థ మోహితవృత్తిచేనుండు
నెప్పుడాత్మజ్ఞాన మొప్పకుండు
తే. గీ. ఇట్టినామది నిన్నాశ్రయించెపుడో - భావజవిలాస॥ 83

సీ॥ ఇంతకాఠిన్య మాయంతరంగము? నాఁడు
చింతించువారి రక్షింపలేదె
బుద్ధినెంచక నింతబుద్ధత్వమా? నాఁడు
శాంతపూజాటన శక్తిలేదె
భావింపనింతపై పైమాటలా? నాఁడు
లోపలిభువనముల్ చూపలేదె
యొక్కకోవెలనింత యొదిగియుంటివె? నాఁడు
బహుహేమమయ హర్మ్యపంక్తిలేదె
తే. గీ. కలదెద్వారకఁగలనాటి బలిమిసీకు - భావజవిలాస॥ 84

సీ॥ నెరనమ్మియుంటి దేవరచి త్తమునకించు
కెరుకలేదో మదికరుగ(లేదో
నారాయణా జగన్నాధ కృష్ణాయని
పిలువగా( వినరాదో బలుకరాదో
యాపదుద్ధారకాయనుచు దీనతవేడ
జాలిలేదో! యిపుడేలరాదో
బంటుబంటనటంచు( బ్రార్థించికొలిచిన
బ్రీతిలేదో ప్రభుఖ్యాతిగాదో
తే. గీ. లోకనాయకనీకు కరాకుదగునె - భావజవిలాస॥ 85

సీ॥ వసుమతి దేవకీవసుదేవసుతు(డవై
నందఘోషమున( జెన్నొందనిలచి
జారచోరాదిచేష్టల వేడ్క విహరించి
గోగోపకుల బ్రోవగోత్రమెత్తి
కంససాల్వమురాది కష్టులదునుమాడి
ద్వారకాపురము వింతగరచించి
శ్రీ రుక్మిణీ స్త్రీల వివాహమై
పాండవవంశంబు బ్రబల(జేయ
తే. గీ. వే! నుతించెదగాని నిన్నెఱు(గగలనె - భావజవిలాస॥ 86

సీ॥ ఋణపాతకబుదారుణ మేమిసేయనో
పూనియిందులకీవె పూట(బడుము
సంసారజంది యెచ్చటముంచివేయునో
గట్టిగా నీవు చేపట్టియుండు
మేమరింపున మృత్యువెట్లు భంగించునో
గరుణనిప్పుడె మముగట్టుకొనుము
కర్మంబులెట్టి దుర్గతుల నొప్పించునో
లొలగక వేవేళ తోడురమ్ము
తే. గీ. విఘ్నముల(బాసి మిమ్ముసేవింపవల - భావజవిలాస॥ 87

సీ॥ ఒకవేళ చీకటినిటికి దీప మిడినట్లు
తేటగా సర్వంబు దెలిసియుండు
నొకవేళ నీహార మెనసిన పద్మంబు
గతిఁ బోల్పఁదగి మందమతిగనుండు
నొకవేళ ద్విరదమూరక త్రొక్కువకొలంకు
పగిది నెంతయుఁగల్కబారియుండు
నొకవేళ క్రొత్తనీటికి మీను బ్రాకిన
కరణి మహాశలఁదిరుగుచుండు
తే. గీ. గాని నిశ్చలపడదు నామానసంబు - భావజవిలాస। 88

సీ॥ సర్వజ్ఞుడవునీవ చతురాననుడవీవ
శతమఖముఖ సర్వితతులునీవ
పద్మినీబాంధవ ప్రముఖ గ్రహమువీవ
వసుధాది పంచతత్త్వములునీవ
సురసిద్ధచారణ గరుడోరగులునీవ
వడినిభకల్పక గిరులునీవ
వరునతోఁతను దివారాత్రములునీవ
వేదాధ్వర తదంగ విధులునీవ
తే. గీ. నీవ సర్వంబు సర్వంబు నీవకావె - భావజవిలాస॥ 89

సీ॥ బహుజన్మకృతతపఃఫలముగా నినుగన్న
తల్లిదండ్రుల చెఱఁదగులజేసి
చిరస్నేహితల గోప తరుణుల విడనాడి
పంశరవ్యధపాలు జేసి
విశ్వసించిన పాండవవేయుల నడవుల
నెడలేని యిడుముల గుడువజేసి
ధాత్రీసురుని సహాధ్యాపకుభవధంస్రీ
చింతనాపరుని కుచేలుఁజేసి
తే. గీ, శ్రితజనావన బిరుదు గట్టితివి భళిర - భావిజవిలాస॥ 90

సీ॥ అక్రూర, విదుర, భీష్మాంబరీషులయందు
గల దయారసమింత జిలుకుమయ్య
ప్రహ్లాద, ముచికుంద, పార్థముఖ్యులమున్న
గన్న చల్లనిచూడ్కిఁ గనఁగదయ్య
శబరి, నహల్య, పాంచాలి, నుత్తరనెట్లు
బ్రోచితివో యట్లు బ్రోవుమయ్య
ధృవ, విభీషణ, గుహోద్ధలపైగల కూర్మి
నించుక నాయెడ నుంచుమయ్య
తే. గీ. నమ్మినాడను పోషించ న్యాయమయ్య - భావజవిలాప॥ 91

సీ॥ జాంబవద్భలుకేశ్వర ముష్టిహతులకు
ప్రీతితప్పనినాటి ప్రేమయున్న
బ్రహ్మర్షిరాడ్భృగుపాదప్రహారంబు
సైఁచిననాఁటి వాత్సల్యమున్న
గంగాసుతాస్త్రసంఘట్టన కాజిలో
కోపమొందనినాఁటి కూర్మియున్న
పారిజాతాసక్త పాకశాసనవజ్ర
ఘాతకోర్చిననాటి కరుణయున్న
తే. గీ. నస్మదపచారములు గాచు టరుదె నీకు-భావజవిలాస॥ 92

సీ॥ రవికోటి తేజో నిరాజిత సాహస్ర
కిరణ చక్రమున కంజలి ఘటించి
పరభయదాశ్రితాభయదస్యనాంచిత
పాంచజన్యం బాత్మ బ్రస్తుతించి
స్వర్ణప్రభామేరు సారాత్యుదారకౌ
మోదకీగదకు కేల్మోడ్పుజేసి
యసుర జీవాభీల హతపరాయణశుభ
నందకంబనిశంబు నతులొనర్చి
తే. గీ. శార్ఙ్గమ్ముభజించి యంతమీశరణుజెంది - భావజవిలాస॥ 93

సీ॥ ఘనవనముల్ గన్నదం(డివి నిజంబుగ నీవ
నీ బిడ్డనని నే గణియింపవలెనె
లోకరక్షాజాగరూకుండ వెన్నంగ
దెలిసి (బోవ పరాకు(దెల్పవలెనె
సకలాంతరాత్మక స్వామి వీవరయంగ
మన్మనోవ్యథదెల్ప మనవివలెనె
సకలశరీర చేష్టావిలాసు(డవు నా
నడువడి నీతోడ
తే. గీ. ఎద్దిభవదిచ్ఛ నారీతి నేలునుయ్య - భావజలాస॥ 94

సీ॥ కలశాంబనిధితరంగముల నెన్న(గవచ్చు
నీ చరిత్రములు వర్ణింపదర(మె
గంగానదీపయ(కణ సంఖ్య(గనవ్చు
నీ గుణావళులు వర్ణింపదరమె
జలధరవృష్టిధారలు గణింప(గవచ్చు
నీ లీలలరసి వర్ణింప(దరమె
గగనతారకలు లెక్కలు బెట్ట(గావచ్చు
నీ వినోదములు వర్ణింప(దరమె
తే. గీ. తరముగాదైన తోచినంతయె నుతించి - భావజవిలాస॥ 95

సీ॥ ప్రాచేతస, మురారి, కవిపదనఖదాంశ
కోటి భాగాంశకు సాటిజాల
కాళిదాస, మురారి, కవిపదనఖదాంశ
లక్షభాగాంశ బోల(గనుజాల
శబ్దశాసన, మూర్తి, చరణాంగుళపదాంశ
శతశతాంశకునైన సమముజాల
క్షితిసర్వకభాగవత పదాంభోజాంశ
దశదశాంశకునైన(దగుల(జాల
తే. గీ. భక్తి, కవితాంశబులు, రెండు బట్టుబంట -భావజవిలాస॥ 96

సీ॥ గ్రహము లెప్పుడు ననుగ్రహదృష్టివీక్షించు
నాపదల్ కడుపలాయనమునొందు
వైరివర్గములెల్ల వాకట్లు బడియుండు
తొలఁగిదుర్దోషముల్ దూరమగును
దర్మాదులప్రయత్నమునఁజేకూరును
మనసు మహానంద మయతనుండు
జగతిజీవుఁడు పునర్జన్మదుఃఖముఁబాయు
భద్రమౌశాశ్వత పదముదొరకు
తే. గీ. దాసులకునీదు నామకీర్తనలవలన - భావజవిలాస॥ 97

సీ॥ ఎచ్చటఁ బూర్వవాహినిగ కృష్ణానది
సరసవీచీపరం పదలంబొలుచు
నెచ్చోటలవణాబ్ధి హీతతరంగములచే
దక్షిణదిశను సందడులునేయు
నెచ్చోట కంకణహేలాగతులవేణి
పశ్చిమతటమున బాయకుండు
నెచ్చోటభోగవతీ గంగబుద్బుదా
కృతుల నుత్తరదిశ నెగయుచుండు
తే. గీ. నచ్చటవినోద గోపురంబమరెనీకు - భావజవిలాస॥ 98

సీ॥ నీ కథాకావ్యంబు నిర్మించి బమ్మెర
పోతరాజుర్విపై బోవువాఁడె
నీకర్పణంబుగా నిరతాన్నదుండైన
కోట శింగనమాట పాటిరాదె
నీదయ కర్థులకేది లేదనకిచ్చు
భాస్కరుఁడిద్ధరబాయువాఁడె
నికు కోవెలఁగట్టి నిజభక్తికికృత్వెంటి
వెంకటాచలమూర్వి వెలయలేఁడె
తే. గీ. క్షితివిమృతులయ్యు కీరితిసుస్థిరులుగారె- భావజవిలాస॥ 99

సీ॥ కాశ్యపగోత్రుడ కాసులవంశచం
 ద్రముఁడ సప్పలరాజు రమణమాంబ
కూర్మితనూజుండ గురువులౌ అద్దంకి
 తిరుమ లాచర్య శ్రీచరణపద్మ
భవ్యతీర్థమరంద పానద్విరేఫాయ
 మానమానసుఁడను మాన్యహితుఁడ
పురుషోత్త మాఖ్యుండ పూల్దండవలె నీకు
 శతకంబు గూర్చితి శాశ్వతముగ

గీ. చిత్తగింపుము మీపాద సేవకుఁడను।
భావజవిలాస హంసలదీనివాస।
లలిత కృష్ణాబ్ధిసంగమస్థలవిహార।
పరమ కరుణాస్వభావ గోపాలదేవ॥ 100

సంపూర్ణము.

శ్రీరామము

శ్రీ వేంకట గురుభ్యోనమః
శ్రీ శ్రీనివాస గురుభ్యోనమః —o—
శ్రీ విష్ణుదాసు గురుభ్యోనమః
శ్రీ కృష్ణదాసు గురుభ్యోనమః

P. Devaraja Perumallu
Padma Mandira
P. Maithilinatha Prasad
P. Urmila Manasa Ravalu
Cell No:- 9000545202
(PADYALA RAMOJI)
P. Venkateswarlu
Ramabhavana
(Pudivada)

